


# అహం-నేను

"కళాప్రపూర్ణ", వేదవేదాంగ పారంగత్, దర్శనతత్వవేత్త
డా. పం. గోపదేవ్

ప్రకాశకులు :
ఆర్యసమాజము, కూచిపూడి - 522 313

3/-




# అహం-నేను



"కళాప్రపూర్ణ", వేదవేదాంగ పారంగత్, దర్శనతత్వవేత్త

డా. పం. గోపదేవ్

ప్రకాశకులు :

**ఆర్యసమాజము, కూచిపూడి - 522 313**

ఓమ్

# అహం - నేను

## (జీవ స్వరూపము)

"న త్వేవాహం జాతు నాసం న త్వం నేమే జనాధిపాః
న చైవ న భవిష్యామః సర్వే వయ మతః పరమ్"

'నేను, నీవు, ఈ రాజులెల్లరు నెల్లపుడు నుందుము' అని భగ వద్ గీతావచనము.

సంస్కృతమున 'అహమ్' అనియు, తెలుగున 'నేను' ఆంగ్లే యమున 'ఐ', ఆర్యభాష-హిందీలో 'మై' అనియు చెప్పబడు వస్తు వెయ్యది? లోకమున ఘటము, పటము, గుఱ్ఱము, ఎద్దు, ఏనుగు, వృక్షము, నది, కాలువ, పర్వతము, భూమి, ఆకాశము, అను నిట్టి పదములు వినుచుందుము. ఈ పదములు వినిన వెంటనే వినిన వ్యక్తి కా యాపదమేదోయొక వస్తువును బోధించును. ఘటము అను పదము వినుటయే తడవుగ నీటిని తెచ్చుటకో, తీసికొని వెళ్ళుటకో అనువగు నొకపాత్ర వినిన వ్యక్తి మనస్సుకు స్ఫురించును. గుఱ్ఱము అను పదము వినిన తోడనే నాలుగు కాళ్ళుకలిగి ఆ కాళ్ళకు చీలని గిట్టలు కలిగి, మెడమీద జూలుగలిగి యుండు జంతువు ఒకటి వినిన వ్యక్తి మనస్సుకు బోధపడును. ఇట్లే యితర పదములు కూడ వాని వానికి తగిన వస్తువులను మనుజులకు స్ఫురింపజేయును. అందువల ననే భాషాభిజ్ఞులు పదము నర్థబోధకముగ జెప్పుదురు; "వాచ మర్థో నుధావతి".

ఇట్లే లోకమున నెల్లరు అహమ్-నేను-ఐ-మై అను పదముల వా యూ భాషలలో ప్రయోగింతురు. మనము తెలుగున 'నేను'

అనియు సంస్కృతమున 'అహమ్' అనియు ననుచున్నాము. ఈ పదములను వినినపుడు వినిన వ్యక్తికి తెలియువస్తు వెయ్యది? తెలుగు భాషను వాడు ప్రజలలో 'నేను' అను పదమును ప్రయోగింపని వ్యక్తి యొక్కడును నుండడు. మాటాడనేర్చిన ప్రతి వ్యక్తియు 'నేను' అను పదము నెల్లవేళల వాడుచునేయుండును. నేను వచ్చుచున్నాను. నేను జూచుచున్నాను. నేను నిద్రించుచున్నాను నే నెఱ్ఱగా, లావుగా, పొడవుగా నున్నాను. ఇట్టి ప్రయోగములు నిత్యము ప్రతి వ్యక్తియు పలుమాఱు ప్రయోగించును. కాని యీ నేను పదమును బ్రయోగించు వ్యక్తికిగాని, ఆ పదమును విను వ్యక్తికిగాని ఆ పదమేమి బోధించును? పాఠకులారా, ఎప్పుడైనను మీ రీ పదమును గూర్చి యిట్లు ప్రశ్నించుకొనియున్నారా? ప్రశ్నించికొని యుందురేని మీకీ ప్రశ్నకు దొరికిన సమాధానమేమి?

ఒక యువకుడు నిలువుటద్దమున కెదురుగ నిలువబడి తన ప్రతిబింబము నందు కనులారచూచి 'నేను' ఎఱ్ఱగా నున్నాను. 'నేను' లావుగ నున్నాను. 'నేను' పొడవుగ నున్నాను. నాయంత పొడవు నా స్నేహితులలో నెవరున్నారు? నా యంతటి యందగా డెవడున్నాడు? నా యంతటి బలవంతుడు మాత్ర మెవఢు గలడు? అని యనుకొనును. ఆ యదనుననతని కీ 'నేను' అను పదమేమి బోధించుచున్నది? ఎఱుపు, ఎత్తు లావు, అందము బలము ఇవి యన్నియు శరీర ధర్మములే కదా! తన శరీరమును జూచుకొని యేకదా, నేను ఎఱ్ఱగా, లావుగా, ఎత్తుగా, అందముగా, బలముగా, నున్నానని యనుకొనుచున్నాడు? కావున నపుడు 'నేను' అనుపదము శరీర వాచకము - శరీరబోధకము అగుచున్నది. అటులయిన నేను శరీరమా? కాక మఱి యేమగును? అందురేని, నాకాలు, నా హస్తము, నా శిరస్సు, నా ముఖము, నా యుదరము, నా కన్నులు, నా శరీరము అని చెప్పినపుడు శరీరము 'నేను' కాదని తెలియుచున్నదికదా? నేను శరీరముకాదు; శరీరము నాది యనియు బోధపడుచున్నది. నా గృహము, నాధనము, నాభార్య,

నా బిడ్డలు అనునట్టి ప్రయోగాలలో 'నేను' వేఱు, గృహాదులువేఱు అని స్పష్టముగ తెలియును. అట్లే శరీరము కూడ 'నేను' కంటె భిన్నము అనుటలో సందేహములేదు. కావున శరీరము నేనుకాదు మఱి 'నేను' అననేమి? ఈ ప్రశ్నమట్లే యున్నది. నే న నేమో తెలియకయే జనులెల్లరు పండితులు, పామరులు, నీ పద మును వాడుచున్నారా? నేనన తెలియనివా డెవడు? ఎవడును లేడు, మనుజుడు తెలియని పదమునెట్లు ప్రయోగించును? జీవిం యున్నంతవఱకు ప్రతివ్యక్తియు తనను గూర్చి 'నేను' ఉన్నాననియే యెంచును. ఎంచుటయే కాదు, చెప్పును కూడ, ఎవరు? అను ప్రశ్నకు 'నేను' అని సమాధాన మియ్యని మనుజు డెవడుండును? తన యునికిని గుర్తించియేకదా ప్రతివ్యక్తియు నేనున్నానని అనుచు న్నాడు! అది గుర్తింపనివాడు 'నేనున్నాను' అనియెట్లు చెప్పగలడు? కావున 'నేను (అహమ్) అను పదమే యర్థమును చెప్పునో యది యెల్లరకు తెలిసియే యున్నదని బోధపడుచున్నది. కాని ఆ వస్తువె య్యది? అది యెట్లుండును? దాని స్వరూపమేమి? లక్షణమేమి? అది యింద్రియములకు త్వక్చక్షుశ్శ్రోత్ర జిహ్వాప్రమాణములకు విషయమగునా? ఇంద్రియగోచరమా? కాదా? ఇంద్రియ గోచ రము కానినాడు దానియునికి నంగీకరించుటెట్లు? 'నేను' ఉన్నదా? లేదా? అను నీ ప్రశ్నలకు సమాధానమేమి చెప్పవలసియున్నది?

నేను. ఇదియొక పదము. ప్రతిపదము నొకయర్థమును బోధిం చును. ఏదో యొకవస్తువును, పదార్థమును తెలుపని పదము వ్యర్థమగును. పదమునకు వాచకము అని యింకొకపేరు. వాచక మన చెప్పునది. వాచకముచే తెలియబడు వస్తువు వాచ్యమగును. నేను అను నీపదము నెల్లరు ప్రయోగింతురు. కాని ఇయ్యది దేనికి వాచకము? దీనివలన దెలియబడు వాచ్య మెయ్యది?

పూర్వపంక్తులను జదివిన వారికి 'నేను' అను నీ పదమునకు శరీరము వాచ్యము కాదని స్పష్టమైయుండును. అటులయిన నీ

పదమునకు వాచ్యమెయ్యది? అను ఈ ప్రశ్నమునకు సమాధానము చెప్పవలసియున్నది. నేను అనుపదమువలన దెలియబడు వస్తువెయ్యది? అని ప్రశ్నాభిప్రాయము.

నేను అన 'శరీరము కాదు' అని తెలిసినదికదా! ఇంకను దెలియవలసినదేమి? అని యందురేని, ఇది తెలియుటకాదు. నేను అన శరీరము కాదని చెప్ప సమాధానము నిషేధాత్మకము, అది స్వీకారాత్మకము కాదు. కొండొక వస్తువును గూర్చి ప్రశ్నించునపుడు దానికి సమాధానము 'అదియియ్యది' అని చెప్పవలెను. కాని అది యిది కాదు; అది కాదు; అని చెప్పుట సమాధానము కానేరదు.

ఒకనికి 'గోవు' అననేమో తెలియ దనుకొనుడు. అతడు తెలిసిన వ్యక్తిని 'గోవు అననేమి?' అని ప్రశ్నించె ననుకొనుడు. అతని ప్రశ్నకు గోవు అన గేదె కాదు; సింహము కాదు, అని సమాధానము చెప్పినచో నా వ్యక్తికి గోవన నేమో స్పష్టముగ బోధపడునా? పడదు. ఈ సమాధానము నిషేధాత్మకము (Negative answer). ఇయ్యది స్వీకారాత్మక సమాధానము (Affirmative answer) కాదు. ప్రశ్నకు సమాధానము స్వీకారాత్మకముగనే యుండుట శ్రేష్ఠము! అప్పుడే ప్రశ్నకర్తకు వస్తువు బాగుగా తెలియును. గోవన నేమి? అని యడిగినపుడు ఇదిగో, యిది గోవు అని చెప్పవలెను. ఇట్లే ఘటము అననేమి యని యెవరేని ప్రశ్నించినపుడు ఘటము చెంబు కాదు; కంచము కాదు; గిన్నె కాదు; కుక్క కాదు; నక్క కాదు; ఇది కాదు; అది కాదు; అని యెంత చెప్పినను ప్రశ్నకర్తకు ఘటమననేమో తెలియదు. కావున ఘటమన నిదిగో యిది ఘటము. ఇది నీరు తెచ్చుట కుపయోగించు నొక పాత్ర. అది యిట్లుండును అని స్వీకారాత్మక సమాధానము చెప్పినపుడే ప్రశ్న కర్తకు వస్తుయాథార్థ్యము తెలియును. ఇది కాదు; అది కాదు; అను నిషేధాత్మక సమాధానము వలన వస్తువు బాగుగ తెలియదు.

కావున ప్రస్తుతమున 'నేను' అను పదమున కర్థమేమి? అను

డును. గుణములుండుటచే నది గుణియనియు చెప్పబడును.

వస్తువునందుండు ధర్మములలో కొన్ని సాధారణములు, కొన్ని అసాధారణములు అని రెండురకములైన ధర్మములుండును. అనేకవస్తువులలో నుండు నొకేవిధమగు ధర్మము సాధారణ ధర్మ మనబడును. అనేకములలో నుండక నొకేదానియందుండు ధర్మము అసాధారణ ధర్మమనబడును. తెలుపురంగుగుల వస్తువు లనేకము లున్న వనుకొనుడు. వానిలో నుండు నీతెలుపురంగు ఆ వస్తువుల సాధారణ ధర్మమగును.

ఉష్ణత అగ్నిలోనే యుండును. ఇతర వస్తువులయిన జలాదులలో నుండదు. ఇట్లే శీతలత నీటిలోనే యుండును. ఇతరమున నుండదు. కావున ఉష్ణత, శీతలత అనెడి ధర్మములు అగ్ని జలములకు క్రమమున అసాధారణ ధర్మము లనబడును.

ఆ యావస్తువులలో నుండు నిట్టి యసాధారణ ధర్మములే లక్షణములనబడును. అవియే యా వస్తువులకు స్వరూపములనియు, రూపములనియు చెప్పబడును. ఈ యసాధారణధర్మమే - లక్షణమే వస్తువును బోధించును. మన మే వస్తువును దెలిసికొనగోరు చున్నామో యా వస్తువు నితర వస్తువులనుండి వేఱుచేసి బోధించు నదియే లక్షణ మగును.

ఉదాహరణము మూలమున నీ విషయము పాఠకుల కింకను బాగుగ స్పష్టము కాగలదు. ఒక వ్యక్తికి గోవు అననేమో తెలియ దనుకొనుడు. అతడు గోవు నెఱుగదలచి, యెఱిగిన వ్యక్తిని 'గోవు' అన నెట్టి జంతువు? అని ప్రశ్నించును. అతనికి గోవును దెలుపవలసి యున్నది. కావున గోవు లక్ష్యమనబడును.

లక్ష్యమును దెలుపునది లక్షణమగునని యింతకుపూర్వమే చెప్పి యున్నాము.గోవునకు లక్షణమేమి? లక్షణమన నసాధారణ ధర్మమే కావున గోవులో నుండు నసాధారణధర్మము తెలిసిన దానిమూలమున

గోవు బాగుగ తెలియనగును.

జంతువులలో ననేకజంతువులకు నాలుగు కాళ్ళుండును. నాల్గు కాళ్ళు కలిగియుండుట యనేకజంతువులలో నుండు నొకధర్మము. కాని, యీధర్మము సాధారణ ధర్మము; అసాధారణ ధర్మము కాదు. అట్లే యనేక జంతువులకు రెండు కొమ్ములు కలిగియుం డుటయు సాధారణ ధర్మమే. ఇట్లే తెలుపు, నలుపు, రంగులు కలిగియుండు జంతువు గోవు అని చెప్పిన నా ధర్మములు గోవు నకు లక్షణములు కావు. ఇవియన్నియు గోవులలోను, గోవులుకాని జంతువులలోను నుండు ధర్మములు, కావున సాధారణ ధర్మములు, అసాధారణ ధర్మములు కావు. అందువలన గోవన నేమో తెలియదు. గోవులకు మెడక్రింద తోలు వ్రేలాడుచుండును. అది తెలుగున 'గంగడో' లనియు, సంస్కృతమున 'సాస్న' యనియు ననబడును. గంగడోలు కలిగియుండుట గోవునకు అసాధారణ ధర్మము - విశేష ధర్మము. ఇదియే దానికి లక్షణము, గోవు నెఱుగనివానికి 'ఏ జంతువు మెడక్రింద దుప్పటివలె తోలు వ్రేలాడుచుండునో యది గోవు' అని తెలిపిన నతడు ఆ జంతువును స్పష్టముగ తెలిసికొనగలడు. కావున గోవునకు సాస్నాదిమత్వము - గంగడోలు, నాలుగుకాళ్ళు మున్నగునవి కలిగియుండుట లక్షణమగుచున్నది. ఈ లక్షణమును బట్టి లక్ష్యమగు గోవు బాగుగ తెలియబడును. ఆ జంతువునకు చెందిన జ్ఞాన మతనికి గలుగును. లక్షణమననేమో, దాని మూలమున లక్ష్యము - వస్తు వెట్లు తెలియబడునో పాఠ కుల కొకింత విదితమై యుండునని యెంచెద. ఇక ప్రమాణమును గూర్చియు కొంత వివరింప యత్నింతును.

ప్రమాణము:- ప్రమ - జ్ఞానము. ప్రమాణము - జ్ఞానసాధనము, ప్రమాణములు నాలుగు. 1. ప్రత్యక్షము 2. అనుమానము 3. ఉపమానము 4. శబ్దము. ఈ నాలుగు ప్రమాణములవలనను నాల్గు విధములైన జ్ఞానము కలుగును. ప్రత్యక్షము, అనుమితి, ఉపమితి, శాబ్దము అని యీ జ్ఞానమునకు పేర్లు.

1. ప్రత్యక్షప్రమాణము :- అక్షమన ఇంద్రియము. ప్రతి + అక్షము = ప్రత్యక్షము - ప్రతి ఇంద్రియము. కన్ను, ముక్కు, చెవి, జిహ్వ. త్వక్కు అను నీ యైదింద్రియములవలనను మనుజులకు జ్ఞానము కలుగును. లోకమునగల వస్తువుల జ్ఞాన మీ యింద్రియములవలననే కలుగునన్నట యెల్ల రెఱిగినదియే, కావున నింద్రియములైదు ప్రత్యక్ష ప్రమాణమనబడును. వీనివలన కలుగు జ్ఞానము ప్రత్యక్షజ్ఞాన మగును. ఇట్లు వస్తుజ్ఞానమునకు సాధనములగుటవలననే నేత్రాదీంద్రియములకు జ్ఞానేంద్రియములనియు నామము. ఈ యింద్రియముల మూలమున రూప, రస, గంధ, స్పర్శ, శబ్దములు గల వస్తువుల జ్ఞానము కలుగును.

2. అనుమానము:- (అను పశ్చాత్ మీయతే జ్ఞాయతే ఇత్యనుమానమ్) ప్రత్యక్ష ప్రమాణముచే దెలియబడు వస్తుజ్ఞానముమూలమున నూహించి ప్రత్యక్షము కాని వస్తువును దెలిసికొన ననువగు ప్రమాణము అనుమాన మనబడును. పొగనుచూచి నిప్పును ఊహింతుము. ఈ నిప్పుకు సంబంధించిన జ్ఞానము అనుమానికము - అనుమితి యనబడును. ఇట్లే గుణములను ప్రత్యక్షముగా నెఱింగి గుణిని ఊహించి తెలిసికొనుటయు, కారణమునుజూచి కార్యము నూహించుటయు అనుమితియే యనబడును, ఇట్లనుమాన ప్రమాణ మనేకవిధములనియు పాఠకులు గుర్తింపవలెను.

3. ఉపమానము:- సాదృశ్య జ్ఞానమువలన వస్తువును తెలిసికొనుట ఉపమితి యనబడును. కావున సాదృశ్యజ్ఞానము ఉపమాన ప్రమాణమగును. అడవిలో నుండు గోవు గవయ మనబడును. అది నాగరిక గోవువలెనో ఉండును. నాగరిక గోవులోనుండు లక్షణము అడవిలో నుండు గోవులో కనిపించినపుడు దానిని గవయమని గుర్తింతుము; ఇదియే యుపమితి జ్ఞానము.

4. శబ్దము:- ఆప్తులు చెప్పు వాక్యము శబ్దప్రమాణ మనబడును. ఆప్తులు యథార్థము చెప్పువారు. అట్టివారు చెప్పువాక్యముల వలనను జ్ఞానము కలుగును. అట్టి జ్ఞానము శాబ్దజ్ఞాన మనబడును.

వేదము ఈశ్వరీయమగుటవలనను, ఈశ్వరుడు పరమాప్తుడగుటవల నను వేదవాక్యములు శబ్దప్రమాణముగ నంగీకరింతురు.

ఇట్లీ నాలుగువిధములగు ప్రమాణములు, వానివలన జ్ఞానము కల్గు విధానము పాఠకులు గుర్తింపవలెను. ప్రమాణములను గూర్చి మిక్కిలి సంక్షేపముగ నిట వివరింపబడినది. వివరములు ఎక్కువగా తెలిసికొనదలచినవారు నాచే రచయింపబడిన న్యాయదర్శనమును జూడగోరెద.

ప్రమాణములు తెలియనివారికి బ్రహ్మాండమునగల వస్తువులను దెలిసికొను విధము తెలియుదు. వారు తమ యింద్రియములకు తెలియని వస్తువులను సరిగ గుర్తింపజాలరు. బ్రహ్మాండమునగల పదార్థములన్నియు నింద్రియమువలననే తెలియువు. ఇంద్రియములకందని విషయము లెన్నియో యున్నవి. ప్రత్యక్ష ప్రపంచ మతి స్వల్పము. అనుమానాది ఇతర ప్రమాణములవలన దెలియుదగువస్తువులెన్నియో యున్నవి. అందువలన నీ వ్యాసమునందు ప్రమాణములను గూర్చి యొకింత వ్రాయబడినది.

ఇట్లు లక్షణప్రమాణములు తెలిసిన తదుపరి దీని సహాయమున 'నేను' అననేమో తెలిసికొనువిధము ముందు వివరింపబడును.

'నేను' అను పదముచే దెలియబడు వస్తువు ప్రత్యక్షప్రమాణమునకు విషయముగాదు - ఇంద్రియములకు దెలియు వస్తువుగాదు. శరీరమింద్రియగోచరమే. కాని, 'నేను' ఇంద్రియగోచరము కాదు. ఇంద్రియములకు దెలియు వస్తువు లెట్టివో తెలిసినచో 'నేను' ఇంద్రియములకేల తెలియుదో స్పష్టము కాగలదు.

తెలుపు, నలుపు, ఎఱుపు మున్నగు రంగులు గల వస్తువులే నేత్రములకు గోచరములగును. నాసికకు గంధముగల వస్తువులు తెలియును. జిహ్వకు రుచులుగల వస్తువులు బోధపడును. చెవులకు శబ్దములు, శబ్దములుగల వస్తువులు గ్రాహ్యము లగును. త్వగింద్రియమునకు స్పర్శ. స్పర్శగల వస్తువులు గోచరించును. శబ్దస్పర్శరూప

రసగంధములలో నే గుణమున్న వస్తువైనను ఇంద్రియముచే తెలియన గును. 'నేను' అనబడు వస్తువులో పైన వర్ణించిన యైదుగుణములలో నొక్కగుణము కూడ లేదు. అందువలన 'నేను' ఇంద్రియగోచరము కాదు - ప్రత్యక్ష ప్రమాణముచే దెలియబడదని యభిప్రాయము: కావున 'నేను' లో నున్న గుణముల మూలమున దాని నెఱుగవచ్చును.

'నేను' అను నొకవస్తువు శరీరమునందే యున్నట్లు మనకు నిత్య వ్యవహారమువలన దెలియుచునే యున్నది. నేను ఉన్నాను; నేను వచ్చుచున్నాను; నేను చూచుచున్నాను. అను నీప్రయోగము లన్నియు శరీరధారియే ప్రయోగించును. ఒకసమయమున శరీరము అట్లే యున్నను నీ ప్రయోగము లుండవు. మరణానంతరమున శరీరము కొంతతడవు పూర్వ మున్నట్లే యుండును. కాని, యప్పుడా శరీరము 'నేను' ఉన్నాను; వచ్చుచున్నాను; అను నిట్టి ప్రయోగము లను ప్రయోగింపదు. అప్పుడా శరీరమున 'నేను' అనునది లేదనియు, అది యెక్కడికో పోయినదనియు మనమూహింతుము. దీనింబట్టి మనకు గనబడు శరీరమునందొకప్పుడు 'నేను' ఉండుననియు, ఒకప్పుడది యుండుండక యెటకో పోవుననియు దెలియుచున్నది. ఇంతేకాక 'నేను' శరీరమునందున్నప్పుడు ఆ శరీరమున జ్ఞానము, ఇచ్ఛ-కోరిక, ప్రయత్నము, ద్వేషము, సుఖము, దుఃఖము నన్నియు నుండును. 'నేను' శరీరమును విడిచిపోయినపుడు జ్ఞానాదు లందుండవు. నేను శరీరమున నున్నప్పుడు ఆ నేను తన కిది తెలియును, అది తెలియును, అనును, అనుటయే కాదు. వస్తువుల నది తెలిసికొనును: ఇదిగో ఇది పుస్తకము; ఇదిగో యిది యిల్లు; అని యిట్లు వస్తువుల నెఱుగును. అంతేకాక, తనకు ఆవస్తువులు కావలెనని కోరును. ఆ వస్తువులలో కొన్ని తనకు పనికిరానివిగ నెంచును. వానిలో నేదేని వస్తువు తనకు దుఃఖము కలిగించున దగునెడల దానిని ద్వేషించును. కావలె ననుకొనిన వస్తువులను సంపాదించుటకును: ద్వేషించు వస్తువు లను దూరముగ నుంచుటకును ఈ 'నేను' ప్రయత్నము చేయును.

సంపాదించుకొనిన వస్తువులను వాడుకొని ఉపయోగించుకొనినపుడు తన కనుకూలముగనుండని పక్షమున బాధపడును; దుఃఖించును. ఇట్లు జ్ఞానము, కోరిక, ద్వేషము, ప్రయత్నము, సుఖము, దుఃఖము నను నీ యాఱు గుణములు 'నేను' శరీరమునందున్నంతవఱకు నుండును. నేను శరీరము నుండి పోయినపుడు మిగిలిన కేవల శరీరమున శవమున పైగుణములు కూడ కనిపింపవు. ఇది ఎల్లరకు తెలిసిన విషయమే కదా! దీనింబట్టి యేమి తెలియుచున్నది? నేను అను వస్తువునకును, జ్ఞానాదులగు నాఱుగుణములకును సంబంధము న్నట్లు స్పష్టముగ తెలియుచున్నది. అందువలననే, 'నేను' శరీర మున నున్నపు డవి యుండును. నేను శరీరమున లేనపు డవియు నుండవు. ఏది యున్న నేగుణములుండునో, ఏదిలేకున్న నేగుణము లుండవో, అది యాగుణములు కలిగిన వస్తువని నిస్సంశయముగ తెలిసికొనవలెను. అగ్ని యున్నపుడు ఉష్ణముండును. అగ్ని లేనపుడు ఉష్ణముండదు. కాబట్టి అగ్ని యుష్ణగుణము కలది యనుట లోకవి దితము. కావున జ్ఞానము, కోరిక ద్వేషము, ప్రయత్నము సుఖము, దుఃఖమునను నీ యాఱు గుణములు కల్గినది 'నేను' అని మన కిప్పుడు స్పష్టముగ తెలిసినది. 'నేను' జ్ఞానాది గుణములుగల యొక వస్తువు - అని పైపంక్తులవలన పాఠకులు బాగుగ గుర్తింపగలరని యెంచెద. అందువలన నేననునేమి? అను ప్రశ్నకు సత్తాత్మక సమాధాన మేమగుచున్నది? జ్ఞానాది గుణములు గల వస్తువు అని సమాధానము. నేను జ్ఞానాది గుణములుగల యొకవస్తువై నపు డది యేల ప్రత్యక్షముకాదు? అని ప్రశ్న కలుగును. కాని జ్ఞానాది గుణములు ఇంద్రియములకు తెలియు గుణములు కావు. శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములను నైదు గుణములే ఇంద్రియ ములకు దెలియును. కావున, 'నేను' ఇంద్రియగోచరము కాదు - ప్రత్యక్షముకాదు - అని భావము. 'నేను' జీవుడు, జీవాత్మ అను నీపదములన్నియు సమానార్థకములని యిదివరకే పాఠకులు తెలిసికొ నియున్నారు. కావున జీవుడు జ్ఞానాదిగుణములు గల యొకవస్తువని

యిప్పుడు పాఠకులు బాగుగ గుర్తింపవచ్చును. ఈ జ్ఞానాదిగుణములె జీవునకు లక్షణము. ఈ లక్షణమును బట్టియే నేను-జీవుడు-అననేమో తెలియనగుచున్నది. అనగా గుణములమూలమున గుణి తెలియబడినదని భావము. గుణములను బట్టి గుణిని తెలిసికొనుట అనుమాన ప్రమాణమునకు విషయమగును. ఈ విధముగ లక్షణ ప్రమాణములతో 'నేను' అననేమో పాఠకులు గ్రహించి యుందురని యెంచెద. ఇకముందు శాస్త్రప్రమాణములతో నీ విషయము కొంత వివరింప యత్నింతును.

భారతీయ దార్శనికుల - వేదాంతుల - తాత్త్వికులలో కణాద మహర్షి యొకరు. ఇతడు క్రీస్తుకు చాల పూర్వుడు. గ్రీకు వేదాంతులయిన ప్లేటో, సోక్రటీసు మున్నగువారికంటెను పూర్వుడే. ఇతడు పరమాణువాది. ఈ జడ ప్రపంచమునకు మూలతత్త్వములు పరమాణువులని ప్రప్రథమమున చెప్పినవాడు. ఇతడు తన వాదమును క్రమబద్ధముచేసి యొక శాస్త్రమును రచియించి యున్నాడు. అదియే వైశేషిక దర్శనము.

కణాదుడు తన శాస్త్రమునందు ముందుగ ప్రపంచమూలతత్త్వములన్నింటిని నాఱు భాగములుగ విభజించి వానికి పదార్థములని నామకరణ మొనర్చియున్నాడు. 1. ద్రవ్యములు 2. గుణములు 3. కర్మలు 4. సామాన్యము 5. విశేషము 6. సమవాయము. ఈ పదార్థము లన్నింటిని మరల విభజించి క్రమముగ వానిని వివరించి యున్నాడు. వానిలో ప్రథమ విభాగమగు ద్రవ్య పదార్థమును తొమ్మిది విధములుగ విభజించియున్నాడు.

"పృథి వ్యాపస్తేజో వాయు రాకాశం కాలో ది గాత్మా మన ఇతి ద్రవ్యాణి" వై.సూ.

1. భూమి 2. జలము 3. అగ్ని 4. వాయువు 5. ఆకాశము 6. కాలము, 7. దిక్కు 8. ఆత్మ 9. మనస్సు అను నీ తొమ్మిదియు ద్రవ్యము లనబడును.

పాఠకు లింతవఱకు తెలుగున 'నేను' అని యే వస్తువును గూర్చి తెలిసికొనియున్నారో యా వస్తువునే కణాదుడు తనశాస్త్రమున 'ఆత్మ' యని చెప్పి ద్రవ్యములలో చేర్చి కీర్తించియున్నాడు. ఇక ముందు ఆత్మ యని వచ్చినచోట పాఠకులు దానిని 'నేను' అనియే తెలిసికొనగోరుచున్నాడ.

కణాదమహర్షి 'ఆత్మ'ను ద్రవ్యమని తన శాస్త్రమున చెప్పియున్నాడు. ఇట ద్రవ్యమననేమో తెలిసికొనవలసియున్నది. అప్పుడే దాని స్వరూపము పాఠకులకు బాగుగ బోధపడగలదు.

కణాదుడు స్వయముగ ద్రవ్యమన నెమో యిట్లు స్పష్టము చేసియున్నాడు.

"క్రియాగుణవత్ సమవాయి కారణమితి ద్రవ్యలక్షణమ్" వై.11-15

దేనియందు క్రియ, గుణములు ఉండునో అది ద్రవ్యమనబడును. లేక దేనియందు అవినాభావ సంబంధముతో కార్య ముత్పన్నమగునో యదియు ద్రవ్యమనబడును. దానిని సమవాయి కారణ మనియు నందురు. (అవినాభావ సంబంధమనగా విడదీయుటకు వీలులేని సంబంధము), సమవాయి కారణమునుండి కార్యమును విడదీయుటకు - వేఱుచేయుటకు వీలుండదు. ఉదాహరణము: వస్త్రమునకు దారములు సమవాయి కారణము, ఆ సమవాయి కారణమనబడు దారములలోనే వస్త్రమను కార్యముత్పన్నమగును. దారములనుండి వస్త్రమును వేఱుచేయ వీలుండదుకదా! కావున దారములకు వస్త్రమునకు గల సంబంధము అవినాభావ సంబంధమనబడును. ఇట్టి సంబంధముతో దేనియందొక వస్తువుత్పన్నమగునో యది ద్రవ్య మనబడునని భావము. సమవాయి కారణమనునది యెల్లప్పుడు ద్రవ్యమే యగును. కాని ద్రవ్యమనబడు ప్రతివస్తునందును కార్యముత్పన్నము కావలెనను నియమము లేదని పాఠకులు గుర్తించుకొనవలెను.

ఇట్లు భారతీయ తత్త్వజ్ఞుల దృష్టిననుసరించి 'ఆత్మ' భూమ్యాదులవలె నొక ద్రవ్యమనియు, అయ్యది క్రియాగుణముల కాశ్రయమ

నియు నిర్ణయింబడినది. ఆంగ్లేయభాషలో వైజ్ఞానికులు ద్రవ్యమును 'సబ్ స్టెన్స్' (Substance) అందురు. ఇంకను పరిష్కృత భాషలో చెప్పిన 'సబ్ స్ట్రేటమ్' (Substratum, Noumenon) గుణాశ్రయము అనియు చెప్పవచ్చును. కావున ఆత్మ యనునది భారతీయత త్త్వజ్ఞుల యభిప్రాయమున స్వతంత్ర సత్తాగలిగి, క్రియాగుణముల కాశ్రయమైన యొకవస్తువనియు, అయ్యది ప్రపంచ మూలతత్త్వము లలో నొకటనియు నిర్ణయింపబడినట్లు పాఠకులు గుర్తుంచుకొనవలెను.

ఓమ్ తత్ సత్

రచనలు,అనువాదములు : సత్యార్థ ప్రకాశము,ఋగ్వేదాది భాష్యభూమిక, నిరుక్తము, ఋగ్వేద భాష్య భాస్కరము I,II,III, వైదిక వినతి I, II, వైదిక దినచర్య, న్యాయ, వైశేషిక, సాంఖ్య, యోగ, వేదాంత దర్శనములు,ఈశ, కేన, కఠ, ప్రశ్న, ముండక, మాండూక్య, ఐతరేయ, తైత్తిరీయ, శ్వేతాశ్వతర, ఛాందోగ్య, బృహదారణ్యకోపనిషత్తులు, ఆస్తికవాదము, అర్థ ధర్మ మీమాంస, సంస్కారవిధి, భగవద్గీత, ఏసుక్రీస్తు రహస్య జీవనము, పూజ, వైదికపర్వపద్ధతి, అపశూద్రాధికరణము మొదలగునవి చిన్న గ్రంథములు 25.

## లఘు గ్రంథములు ఇప్పుడు విడివిడిగా లభ్యమగుచున్నవి.

| | |
|---|---|
| వేదాంతి ధ్వాంత నివారణము | 3=00 |
| గోకరుణానిధి | 3=00 |
| భాగవత ఖండనము | 3=00 |
| లక్ష్మీసూక్తము | 3=00 |
| అపశూద్రాధికరణము | 3=00 |
| హేతువాది దయానంద | 3=00 |
| శంకరపీఠాధిపతులు - అంటరానివారు | 3=00 |
| శ్రీరామనవమి - సీతాకళ్యాణము | 3=00 |
| జాతీయత | 3=00 |
| వేదమే ఈశ్వరీయం (బైబిలు ఖురాన్‌లు కావు) | 3=00 |
| 'ఓమ్' స్మర | 2=00 |
| అహం-నేను | 3=00 |
| ఈశ్వర స్వరూపము | 3=00 |
| వైదిక వర్ణ వ్యవస్థ | 3=00 |
| అవతార మీమాంస | 3=00 |
| దర్శనములు | 3=00 |
| ఆర్యసమాజ మననేమి? | 3=00 |
| ఈశ్వరుడు ప్రత్యక్ష సిద్ధమా? | 3=00 |
| వైదిక త్రైతవాదము | 3=00 |
| మనము హిందువులమా ? | 3=00 |

(యుగాది 2003 నాటి ధరలు)

Amba Darshana Grandhamaala

**AHAM - NENU** **Rs. 3=00**



మహర్షి దయానంద సరస్వతి

(1824 - 1883)

ప్రతులకు

| | |
|---|---|
| 1. అంబాదర్శన గ్రంథమాల<br>ఆర్యసమాజము,<br>కూచిపూడి,<br>తెనాలి తాలూకా,<br>గుంటూరు జిల్లా - 522313 | 2. మాశెట్టి శ్రీనివాస్ ఆర్య<br>నెం.5 మాశెట్టి బిల్డింగ్,<br>3-3-736 నుండి 740,<br>కంచరబజార్, సికింద్రాబాద్ - 3.<br>ఫోన్ : 55320200<br>55320300 |